Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
జానపాడు.

సంపుటము 21 — 1929 సం॥ ఏప్రిల్ నెల — సంచిక 1

## విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0   సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0   చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, రఘుపతిపేట.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, లగిసెట్టిపేట.
౩ బాకరాజు పరాంకుశరావు దేశాయిగారు. యాడవరం.
౪ రామసింగుగారు- నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౫ శ్రీమద్వేంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పో ష కు లు.

౧ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరు జమీందారుగారు-నూజవీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకొండూరు
౩ జాగర్లమూడి కుప్పస్వామినాయఁడుగారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటురెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జనగాం
౧౧ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౧౨ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౩ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, కాకినాడ.
౧౪ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఆరుమూరు.
౧౫ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౬ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,
౧౭ రాజా కందుకూరు సూర్యప్రకాశరావు బహద్దరు, జమీందారుగారు-దేవిడీ.
౧౮ సాకుంట కిషన్‌రావు దేశముఖ్ గారు, జరితాల.
౧౯ తడిసిన గోపాలరెడ్డి దేశాయిగారు, దొంతి.

## స హా యు లు

౧ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౨ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, పాపురం.
౬ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౭ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౮ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

# అభినవసరస్వతి.


| సంపుటము | జానపాదు | సంచిక |
| --- | --- | --- |
| ౨౧ | శుక్ల సం॥ చైత్రమాసము. | ౧ |


## జవాబు.



అక్కిరాజు ఉమాకాన్తముగారికి:—

వజ్రాయుధము 1928 జూన్ సంచికలో "కారెంపూడిలోని మీయధ్యక్షోపన్యాసము" అను మీగ్రంథమును విమర్శించితిని. అందు మిమ్ము గొనియాడుచు ననేకవిషయముల బేర్కొంటిని. అందు మీ రొక్కదానికిని సమాధానము చెప్పఁజాలక "జి. రామమూర్తి ప్రణీతం" అని యేదో పేరుపెట్టి "వివాదవిచారణ" యను చిన్నపుస్తకము ప్రకటించితిరి. జి. రామమూర్తి పి. భీమమూర్తి యని "జీపీలు" పెట్టుకొని వ్రాయుటకంటె మీ పేరే పెట్టుకొని వ్రాయరాదా? మీకంత వెరపేటికి? నావ్యాసము చివర మీరేదేని వ్రాసిన బదులు వ్రాయుదునని వ్రాసితిని. మీపేరు లేదు కాని విషయమంతయు మీది, భాష మీది, కూర్పు మీది, అని నిర్ణయించుకొని పేరు నూరును సరిగ తెలియని రామమూర్తిగారెవ్వరు, వారికేమిటికి జవాబు చెప్పవలెను, వారేమి సమాధాన మీఁగలరని వారిపేరెత్తుకొనక మీ పేరనే మీకే సమాధానము వ్రాయుచున్నాను. చిత్తగింపుఁడు.

మీరు వ్రాయించిన 14 పుటలలోను మీకు సమాధానము చెప్పఁదగినవి రెండుమూఁడు ముక్కలు. తక్కినభాగమంతయు మ్యునిసిపల్ చెత్త. ఆచెత్తలో, "వ్యాకరణ సంస్కారం లేదు, శాస్త్రపరి

జ్ఞానం లేదు, మీ కవిత్వము మాలిన్యము; పొల్లుపద్యరచన, గుడ్డి మాటలు, గుడ్డివాదాలు, పిశాచతాండవం, పనికిమాలిన పద్యాలు, అప్రశస్తవచనాలు, పనిలేని మంగలి పిల్లితల గొరుగుట, గంతులు వేయడం, నియమహీనపు పద్యాలు, కసవు పద్యాలు, మౌర్ఖ్యము, గతిలేనమ్మకు గంజేపానకం, అసంబద్ధ ప్రలాపములు” ఇత్యాదులు పలికి నన్నెగాక ఆంధ్రకవులనందఱను, దిరస్కరించుట కాక “న్యాయ సూత్రం, న్యాయసూత్రభాష్యం, జైమిని సూత్రం, శాబరభాష్యం, భట్టవార్త్తికం” లోనగు కొన్ని యుద్గ్రంథములపేళ్ళు గ్రంథకర్త్తల పేళ్ళు పేర్కొని యందందుఁ గొన్ని ప్రసక్తిలేని శ్లోకము లుదాహరించి నారు. తర్కము వ్యాకరణము మీమాంస లోనగు నన్నిశాస్త్రములు తలక్రిందులు చేసిన వారివలెనే మాటలాడి నన్నయ తిక్కనాదులు సహితము మూర్ఖులు, నజ్ఞులు, వారి గ్రంథములు నపాత్రములని తేల్చినారు.

అక్కిరాజుగారూ! మీరు చాలా శ్రమచేసినట్లు తోచుచు న్నది. అన్ని గ్రంథములపేర్లు పేర్కొన్నారు. ఓరియంటల్ లైబ్రరీలో చూచినారా? లేక యేకేటలాగులోనైన చూచినారా? లేక యెవ్వ రైనఁ జెప్పినారా! మహాభాష్యం మహాభాష్యం అని పదిసారులు మీరుచ్చరించినను మీరు మహాభాష్యము వాసనయైనను యెఱుంగ రని మిమ్మెఱింగినవారెఱుంగకపోరు. మీ పాండిత్యము సర్వజన నైక వేద్యమే, మేమే సర్వజ్ఞులమని విఱ్ఱవీగకుడు. అస్మదాదులను దూషింప కుఁడు. మీయంతపాండిత్యము లేకున్న మాకుఁ జాలిన పాండిత్యము మాకున్నది. మాపాండిత్యము మాగ్రంథనిర్మితికిం జాలును. మీ పాండిత్యము బడిలో చెప్పుకొనుటకును, నేటికాలపు కవిత్వము అను గ్రంథములు గీకి నన్నయాదులవంటివారిని దిరస్కరించుటకుఁ జాలునని మేము నమ్ముచున్నాము. మీరీవ్యాసములో మముబోంట్లను తెలివి

తక్కువవారనియు నజ్ఞులనియు నేమియు గానివారనియు నాక్షేపించి తిరస్కరించినందుల కింతయును జింతలేదు గాని యిట్టిమీరు ప్రెసిడెన్సి కాలేజిలో నుపాధ్యాయులుగానున్నారే మీ మూలమున నెందఱు విద్యార్థులు చెడిపోయి దుర్మతమవలంబింతురో యని విచారము మాత్ర ము తీఱకున్నది. దానికి దైవమే తోడ్పడవలయును; మీరు నావ్యాస ములో వ్రాసినవానికి సమాధానము చెప్పలేక నాకవిత్వములో దోష ములెంచినారు, ఇది "ఇంటిల్లి పాదీ" అనునట్లున్నది. నేను సర్వజ్ఞుఁడను గాను. అజ్ఞానముచేఁగాని ప్రమాదముచేఁగాని చేవ్రాఁతచేఁగాని ముద్ర ణముచేఁగాని నాగ్రంథములలో దోషములు తోఁపవచ్చును. నా భారత ములో ననేకదోషము లున్నవని వ్రాసినారు. అన్నివేలపద్యములలో మీరెన్ని దోషములు పట్టుకోగలరో చూచెదముగాక. అవి నిజముగ తప్పులైనయెడల దిద్దుకొందును. కానియెడల సమాధానము చెప్పుదును.

నా వజ్రాయుధములో "గ్రామత్రియం దాహకం" అనియుండె నిదితప్పు. "కర్తృకర్మణోఃకృతి" యను సూత్రమున "గ్రామత్రయస్య దాహకం" అని యుండనగునంటిరి. "అకేనోర్భవిష్యదాధమర్ణ్యయోః" దీనికిఁ బ్రసక్తి లేదంటిరి. ప్రసక్తి కలిగింపవచ్చుననియు "గ్రామత్రియం దాహకం" అనునది తప్పుకాదనియు నీచర్చవలన సమర్థింపఁదగినదైనది. కాని దానికిముందు తత్ప్రయోగమునందలి యాథార్థ్యము లోకమున కెఱింగింపవలసినవాఁడనై యిట్లు వ్రాయుచున్నాను. బాగుగా గమనిం పుఁడు.

మా వజ్రాయుధములో "శ్రీకృష్ణకవిరాజీయము" అను పేరితో బాల్యమునుండియు నా రచించిన పద్యములు లోనగునవి ముద్రించుచున్నాను. చిన్నతనమునం జేసిన పద్యములు సంస్కరింపక చేసినట్లుగానే ముద్రించుచుంటిని. అందే 74 పుటలో "నాకుం దెలుఁ

గుభోష రాకున్న కాలములో అల్లమరాజు సుబ్రహ్మణ్య కవిగారు మూకాటవరగ్రామమునకు వచ్చియున్నపు డీపద్యములు రచించివారికిం జూపితి" అని హెడ్డింగుపెట్టి దానిక్రింద, — "శ్రీకందర్ప మృగాంక నిర్జిత మహాశారీర,"

క॥ "శ్రీకాటవరంబున శ్రీ,లకు నాలయమగుచు మిగుల లీలదలిర్పన్
లోకంబులేలు భక్త,వ,శంకరు శంకరునిఁగొల్తు శ్రుతిహితఫణితిఁ.
క॥ "తోట్రేటిగ్రామమందున కుఱ్ఱా సంభావనిచ్చి కుదురుగ నీకుం
బట్టల పెరుగుతో నన్నము, జుఱ్ఱంగాఁ బెట్టఁగలరు చక్కంబోరా."

అని వ్రాసితిని. ఇందు యతులు ప్రాసములు పోవుటయేగాక తెలుఁగు విభక్తి ప్రత్యయములైనన ప్పటికిఁ దెలిసియుండలేదని తెలియుచున్నది. ఆపేజీ మీరు చూచినారా? దానిక్రిందనే నేను కుమార సంభవము చదువుచున్నప్పుడు - "అథవై" అనునదివ్రాసి 75 పుటలో పిమ్మట కొంతకాలమునకు రచించినది.(అనగాకుమారసంభవము చదువుచున్నప్పుడు) అని హెడ్డింగువ్రాసి కృత్వా బ్రహ్మ, గ్రామత్రియం దాహకం అని శ్లోకమును ముద్రించియున్నాఁడను. నావ్రాఁత ప్రతిలో గ్రామత్రయోద్దాహకం అని దిద్దుబాటున్నదిగాని ముద్రించునప్పుడామార్పు నంగీకరింపక తొంటియట్టులే ముద్రించినాఁడను. అది మీరుగాక వివేకులెవ్వరైనఁ దప్పనఁగలరా? మీరొరుల తప్పులు వెదుకఁ బోకుఁడు. మీరు కలముపట్టిన కోటి తప్పులు చేయుదురు.

ఈ ప్రయోగము తొల్లి నేను దప్పనియే యనుకొంటిని గాని ప్రకృతమున నైన మీ వ్రాఁతంజేసిచర్చింపఁగా నది తప్పుగాకపోయినది. ఈ శ్లోకము త్రిపురసంహారమును జెప్పుచున్నది గదా? అప్పుడు మహేశ్వరుఁడు—వేదములను దురగములుగాఁజేసి సువర్ణాచలమును గోదండముగా జేసి భూమిని రథముగాఁజేసి భుజంగాధిపుని మౌర్వీగాఁ

జేసి బ్రహ్మను సూతునిగాఁ జేసి పిమ్మట గ్రామత్రియమును (త్రిపురము లను) దాహకం అగ్నిగా జేసి (అనఁగా నగ్నిరూపముగాఁ జేసి కాల్చి వేసి) కాటవరమున నివసించియున్నవాఁడని నిర్బాధకమైన యర్థము సిద్ధించినది. ఇప్పుడు మీరు గ్రామత్రియం దాహకం అను నాబాల్య ప్రయోగమును దప్పనగలరేమో ? చూతుముగాక.

శ్రీకృష్ణభారతములో "అనవుడు వారు దక్షిణదిశాగతులై" (దిశా + ఆగతులు=దిశాగతులు) దిశనుండి వచ్చినవారును, దిశను బొందినవారును నని యర్థములు. "ఇదితప్పు, పంచమ్యంతంభయాదుల తోను, అపేతాదులతోను పంచమ్యంతాలైన స్తోకాదులు అలుక్స మాసంలో క్తాన్తంతోను సమసిస్తవి, అంతేగాని క్తాన్తాలతో అన్ని పంచమ్యంతాలు సమసించవు. బహుళగ్రహమనేది సుప్సుపావంటివి. అగతికమై రూఢమైన "గ్రామనిర్గతః" అనే ఇట్లాటి వాటికినిగాని తెలి యక తప్పులు వ్రాసిన వాటికిగాదు" అని గంపతిరుగుడుగా మీమాట లేమీకర్థముకానట్లు వ్రాసినారు. దీనింగూర్చి మీతో శాస్త్రార్థమునకు దొడంగుట తగకున్నను, కొంచెము వ్రాయుచున్నాను. చిత్తగింపుఁడు. "దిశాగతాః" దిశాయా ఆగతా ఇతి విగ్రహః, చోరత్రస్తః, భోగో పరతః ఇత్యాదావివ సుప్సుపా ఇతివా మయూరవ్యంసకాదిత్వాద్వా సమాసః-అతఏవ దేశసమాగతా ఇత్యాదిప్రయోగా స్సంగచ్ఛంతే. యత్తు గ్రామనిర్గత ఇత్యత్ర బహులగ్రహణాత్ । "సుప్సుపా, ఇతివా సమాస ఇతి వదంతి. తత్తు అపరఆహ. భయనిర్గత జుగుప్సుభి రితివక్త వ్యం-వృకభయం, గ్రామనిర్గతః అధర్మజుగుప్సుః ఇతి" భాష్యాదర్శన మూలకం. ఇట్లుంట మీకు తెలియక మీరు వ్రాసినారు, దీనికై మీతోఁ జర్చకు దిగక మఱికొన్ని ప్రయోగములు చూపుచున్నా నవి చూచి చిత్తశాంతి చేసికొనుఁడు—

శ్రీమహాభారతము శాంతిపర్వము 33 అధ్యాయము " శ్లో॥ బహవశ్చ మనుష్యేంద్రా నానాదేశసమాగతాః ఇట్లు భారతములో వేలున్నవి. ఇవి ఆర్షములని త్రోసి రాజందురేమో? అట్లయినం గాళిదాసుఁడు తనరఘువంశము 6 సర్గమునందు " ద్వీపాంతరానీతలవంగపుష్పై రపాకృత స్వేదలవా మరుద్భిః "కాళిదాసు నిరంకుశుఁడు, అతఁడు తన కావ్యములలో ననేకములైన తప్పులు వ్రాసి యున్నాఁడతని ప్రయోగములు పనికిరా వందురేమో? భట్టుబాణుండు తన కాదంబరి ప్రథమ భాగము 10వ. గద్యములో "ద్వీపాంతరాగతానేక భూమిపాల మౌళి మాలాలాలిత చరణయుగళః "అనెను. కాదంబరి యసత్కావ్యము అది ప్రమాణముకాదందురేమో? భట్టుమూర్తి యను నామాంతరముగల రామరాజభూషణుఁడు తన వసుచరిత్రమున 3 ఆశ్వాసమున చ॥ జలకములార్చి ...కోమలకుసుమాగతాళికుల అనియు 5. ఆశ్వాసమున "చ॥ హరికరుణాకటాక్ష మహిమాగతదివ్య వివాహమందిర" అనియు వ్రాసెను. అతఁడు వ్యాకరణశాస్త్రము రానివాఁడు, బట్టువాఁ డందురేమో? భారతములో ననేక ప్రయోగములున్నవి. నన్నయ తిక్కనాదు లెందులకుం బనికిమాలినవారని వెనుకనే మీరు వ్రాసియున్నారు. వారి ప్రయోగము లిటుఁజూపినను నిరర్థకములగునని యే భయంపడి తత్ప్రయత్నము చేయనైతి.

అక్కరాజుగారూ, మీ కేగ్రంథము ప్రమాణమని వ్రాయుదురో ఆగ్రంథమునుండియే మీకు తృప్తికరమగు ప్రమాణము చూపుటకు సిద్ధముగా నున్నాను, మీకే ప్రమాణమును నచ్చనిచో మాత్రమేమియుఁ జేయంజాలను. మీరు లోకాతీతులని మాత్ర మీకోం కారమే పెట్టుదును.

నా వజ్రాయుధము పత్రికయం దేదోవ్యాసములో 'రజోవతి' అని పడియున్నదది తప్పంటిరి. వజ్రాయుధములో నేనే కాక పదుగురు వ్యాసములు వ్రాయుదురవి స్వీకరించి ముద్రించుటయుఁగలదు. ఇదిగా కావ్యాసమెవరో వ్రాసినవ్యాసమున కనువాదము. దానింగూర్చి సాధుత్వాసాధుత్వముల నిర్ణయించుట కిష్టత లేదు. అయినను "రజోవతి" యనుట దప్పుకాదని చెప్పుదును. రజః + అవతీ=రజోవతీ, "అవరక్షణ గతికాంతి ప్రీతి తృప్త్యవగమ ప్రవేశశ్రవణ స్వామ్యర్థయాచన క్రియేచ్ఛాదీప్త్యవాప్త్యాలింగనహింసా ఆదాన భాగ వృద్ధిషు" ఇత్యవాప్త్యర్థకావధాతోశ్శతరి స్త్రీత్వవివక్షాయాం నిష్పన్నావతీశబ్దేన రజశ్శబ్దస్య సమాసే రజోవతీశబ్దః రజస్వలాయాం సాధుః యద్యపి శప్శ్యనోరితి నుమాంభావ్యం తథాపి సాగరం తర్తుకామస్య తుబ్ధో రాజా శాకం పచానస్య ఇత్యాది ప్రయోగ సాధుత్వార్థం ఆగమశాస్త్రనిత్యత్వస్య అవశ్యమాశ్రయణీయత్వాన్న దోషః" ఇవియే మీరు పట్టుకొన్న నాతప్పులు. మీ రపరపతంజలులైనట్లు "ఇల్లాటివన్నీ వ్యాకరణశాస్త్రసంస్కారం లేకుండా ఉజ్జాయింపుచూచి వ్రాసిన తప్పు రూపాలు - శ్రీకృష్ణభారతంలో ఉజ్జాయింపు సంస్కృతం దృష్టమవుతుంది, అంటిరి. కొనింపు అట్టివి వివరింప శక్తిగలిగినచో మీరుగాని, మీశిష్యులుగాని, ఆపనికిం దొడంగుడు. చూతము! నన్నయాదులనే తిరస్కరింపగల్గిన మీకు మాబోంట్లు తృణప్రాయమే. ఆహా! మీపాండిత్యము లోకోత్తర మహత్తరమైనది!!

"శ్రీకృష్ణభారతం మీఁద కొందరు పొగడ్త అభిప్రాయాలు వ్రాశారే వానిసంగతి యేమిటంటే వాటికి నేను బాధ్యుణ్ణికాను" అనివ్రాసినారు. మీరు జగదేక పండితులైనప్పుడు చూత మిపుడు మీబాధ్యతయేమి? అబాధ్యతయేమి? మీకు నన్నయాదులకవిత్వమే పనికిరాలేదు. మీకుఁ గవిత్వమే పనికిరాదు. మీకు రాదు. ఇది

"నక్కఱేలగాయ" సామెతను బురిడించుచున్నది. "ఇట్లాటిదిశలో వున్నవారితో వ్యాకరణశాస్త్రవాదాల్లోకి దిగేటంత దైన్యం ఆంధ్ర దేశమందలి వైయాకరణులకు కలుగకుండుగాక" అని దీవించుకొన్నారు. ఆహా! మీరు నొక్క వైయాకరణు లనునభిప్రాయమే. అ, ఇ, ఉ ణ్, లో నర్థమాత్రము తెలిసినవాఁడే వైయాకరణుఁడై పోవునా? మీకు వచ్చిన వ్యాకరణజ్ఞానము, భాషాజ్ఞానము మూఁడునాళ్ళ పట్టపగటిలోసది, గర్వపడవలదు. మహాభాష్యవేత్త నని మీకుంత మీరే చెప్పుకొని నప్పుడు లోకము మిమ్ము మఱియొక విధముగాఁ దలంపక పోదు. తక్కిన యీ క్రింది మీయాకదంపు మాటలకు సమాధానము వ్రాయుటకన్న దారిద్ర్యము మఱియొకటి యుండదు. కావున విడుచుచున్నాను.

అలంకారముల విషయములో అర్థాలంకారములున్నవి. వాని గతి యేమిచేయుదురని నే నడిగితిని. దానికి మీరు తలగలమాటలు వ్రాయలేదు. అవి పనికిరావనియే సూచించినారు. సంతోషము. అలంకారశాస్త్రమే పనికిరాదనియు మముబోంట్లకు సాహిత్యశాస్త్ర పరిజ్ఞానము లేదనియు వ్రాసినారు. మీరేమి వ్రాయలేరు! తెగించిన వానికి తెడ్డే లింగము.

మీరు మీవ్యాసములో పూర్వపక్ష సిద్ధాంతములు పెట్టుకొన్నారు. ఆ పూర్వపక్షములు మీరు చేసికొన్నవే కాని యితరులు చేసికొన్నవికావు- అని నేను వ్రాసినదానికి మీరేమో వ్రాసినారు. గ్రంథములలో, పూర్వపక్షసిద్ధాంతములు తమంత తామే చేసికొనుట లేదని నాయభిప్రాయముకాదు. మీరు చెప్పినమాటలకుఁ దగునట్లె మీరు శంకించుకొన్నారు. మీరు చేసికొన్న శంకల కన్న మీరును మీగురువులును చెప్పలేని శంకలున్నవనుట కట్లు చెప్పితినిగాని మీరిపుడు వ్రాసినట్లు కాదని తెలిసికొందురుగాక. ఇపుడు గ్రంథములు

రచించుట పనిలేని మంగలి పిల్లితల గొఱుగుట వంటిది అంటిరి. మీరు నేటికాలపు కవిత్వం అను చెత్తపుస్తకమును వ్రాసి పిల్లితల గొఱిగినారే. ఇది యేటిపనియో తెలియదు. మాటాడిన కోటితప్పులు చేయు మీరా! అశాస్త్రీయమైననియమహీనపు పద్యాలు అని వ్రాసి గంతులు వేయునారు! కసుపద్యాలు వ్రాయుదురు- అనిమీయమేధ్యపు మాటలు మానుఁడు. మే ముత్తమాధికారులమని గర్వించుచు వ్రాయుట మీకుఁ దగదు "తెలుఁగు ఆరాధ్యభాషగా నుండవలెనని అభిలషిస్తున్నాము" అంటిరి. ఆరాధ్యభాషయన మీపనికిమాలిన బూతు గ్రామ్యమా? మీభాషలో గ్రంథములు వ్రాయఁబూనిన నవి దొరల శౌచవిధికేగాని యొందుకుం బనికిరాని వగునని లోకమునకుం దెలియును.

మీభాష మీమతము పనికిమాలినవి. పచ్చిబూతులైనను మీరు వాడు మాటలకన్న మేలే యనిపించుకొనును. ''పద్యముగాని గద్యముగాని వ్రాసినప్పుడు అవకతవకలు దండగ చెత్తా లేకుండా ఉంటే వాఙ్మయాన్ని సంపన్నం చేశారని కీర్తనీయులు కావచ్చును" ఇదిమంచిమాట. మీరు అట్టిచెత్త చూచియుందురు. ఈ విషయమై క్రిందటి వ్యాసములో కొందఱు మహాకవుల గ్రంథములలోని కొన్ని పద్యములు వ్రాసి వానింజూపి ఇందులో మీదండగణాలు చెత్త చూపగలరా? అని ప్రశ్నించితిని. దానికి మీరు మౌనభూషణము దాల్చినారు. మీరట్టి చెత్తయున్నపద్యము లెత్తి వ్రాసి నన్నుగాని, నాకన్న మిన్నలైయున్న వారినిగాని నిరసింప వచ్చును. కలమున్నది గదా యని గీకుట మీకు గూడని పనియని బోధించుచున్నాను. చేతనైనచో నట్టిపనికిందిగుఁడు. మీ మాట సత్యము చేసికొనుఁడు. లేకున్న వాయినాగికొనుడు. మీరిప్పుడు యతిప్రాసము లక్కఱలేదన్నారు. మఱియొక్కరు గణమక్కఱ లేదని చెప్పుదు రప్పుడేమి

చెప్పెదరని నేను వ్రాసిన దానికి మీ సమాధానము ఎత్తుకోలుమొత్తు కోలుగా నున్నది.

"మఱియొకరు మఱియొక మార్గం చూపుతారని భీతిల్లడం అనుచితం" అనగా అదియు స్వీకరింప వచ్చునని మీయభిప్రాయ ముగదా! అజ్ఞాన కవిత్వమునసే కా దేకార్యమునకును అవధినియమ ముండదు. ఉండకున్న నేమియందురా యన్న మీతో మాటలాడు టకు మీయట్టివాఁడే ఉండవలెను. యతిప్రాసములు తీసివేసి గ్రామ్య మున మీరు వ్రాయుడు; యతిప్రాసములతో గ్రాంధికముగ మేము వ్రాయుదుము మది లోకమునకు నివేదింత మేది సొంపుగా నుండునో లోకమే చెప్పునని నేననగా మీ రేమండీ అట్లు వ్రాసినారు. మీ వ్రాఁత పఱువెత్తలేక బలాదూరు అనునట్లున్నది. మీ కంటికి మన యాంధ్రదేశములోఁ గవిత్వమును బరీక్షించువారే లేరనియున్నది. కదా. అంత యహంభావము మీకుఁదగదు.

"తం సంతః శ్రోతు మర్హంతి" అని కాళిదాసోక్తియు మీకు నచ్చదు. పెద్ద లెవరనియే మీరడుగుదురు. కాలేజీలో నున్నంత మాత్రి నిట్లు పలుక గల్గితిరిగాని వావిళ్ళ ప్రస్సులోనున్న కాలమున నిట్లు మాటలాడఁ జాలరు. అన్నా ! స్థానబలిమి!!

"నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగుఁ బట్టు
బయటఁ గుక్కచేత భంగపడును"

చేతులు కలుపుకొని కలియఁబడుట కూడ మీకిష్టమా. అట్టి పనికి మీరు మీ యామాకాంతులు చాలుదురు. మేము చాల మని ముమ్మాటికిని జెప్పుచున్నాము. "మీరు యతిస్థానము తెగిపో వలెనంటిరి గదా! మీవారు వ్రాసిన "చదివి" నంతన కవిత ఆవిర్భ వించు నాగార్జునుండు

ఇత్యాదులలోని యతులు మీరన్న యతులకు సరిపడినవా? అనియడిగిన మీరేమో తుక్కు వ్రాసినారు. మీ తుక్కు మీరే వహింపుడు. ఇట తలాతోక లేకుండా వ్రాసిన వ్రాతలు మీవో యితరులవో మాకుఁ దెలియదుగాని లోకమునకు తెలియకపోదు. నేను వెనుకటివ్యాసములో వ్రాసిన వాని కొక్కదానికి సమాధానము లేదని మఱియు చెప్పుచున్నాను. మీరనునవియే యసంబద్ధ ప్రలాపములుగాని యితరు లనునవి కావు. ఇంతతోనైనను మీయహంభావమును వెలి గ్రక్కుకొనక శాంతింపుఁడు, శాంతింపుఁడు.



కాశీక్షేత్రమందైన యఖిలభారతవర్షీయ బ్రాహ్మణ
మహాసమ్మేళనమున విచారించుట కీఁబడిన

## ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరసంగ్రహము.

[ సంస్కృతమునకుఁ బరివర్తనము. ]

౧. సూర్యనారాయణశర్మగారు,
వ్యాఖ్యానవాచస్పతి, సంస్కృతపాఠశాల, జయపురము.

వివాహము కేవల మైహికఫలము గలది కాకుండుటవలనను శాస్త్రమె మూలముగలదియగుటవలనను శాస్త్రానుసారముగనే దాని నిర్ణయింపవలెను, గాని యాయుర్వేదాదుల ననుసరించి కాదు. శ్లో॥ షడబ్దమధ్యే నోద్వాహ్యా॥ యను ధర్మశాస్త్ర వచనమునుండి యది యాఱేండ్ల లోపల స్త్రీలకు సర్వవిధముల నిషిద్ధము. ఇట్లు

సర్వవర్ణముల యందును నేడేండ్లు వెళ్ళిన తర్వాతనే వివాహమని నిర్దే శింపఁబడుటవలన నేడవయేటను నంతగా శిష్టు లంగీకరింపరు. కనుకనే ౮ యేండ్లలోపల వివాహము కూడదని నియమించుట మిక్కిలి యోగ్యము. ఎనిమిదవ యేడు మొదలుకొని పదవయేఁడువఱకుఁ జేసెడి వివాహ మైచ్ఛికముగాని నిత్యముగాదు. ౧౦ యేండ్ల తరువాత రజ స్వలాశబ్దవాచ్యయగునను వచనము గౌర్యాదులం బ్రశంసించుటకుఁ గాని వేఱుగాదు. కనుకనే ౧౧ వ యేటఁగూడ స్త్రీ వివాహము యోగ్యమే యయియున్నయది. ౧౨ వ యేడు తుదియవధి. ఇందుల కుఁ బరాశరాది వచనములు మూలములు. ఆతరువాతికాల మన్ని విధముల నసర్హము కనుకనే ౮, ౯, ౧౦, యేండ్లలోఁజేయు పెండ్లి నుండి ఫలాధిక్య ముండుటవలన నది ప్రశస్త మైయున్నది. ౧౧ వ యేడు ప్రశస్తమును గాదు, నిందితమును గాదు. ఏవిధమునఁజూచినను రజో దర్శనమునకు ముందు కన్యాదాన మావశ్యకమైయున్నది. కనుకనే లోక హిత దృష్టితో శాస్త్రమునకు విరోధము లేకుండ బాల్యవైధవ్యాది దుఃఖపరిహారార్థ మంత్యావధియగు ౧౨ వ యేడే వివాహకాలమని వ్యవస్థ చేయుట మంచిది. అప్పుడుగూడ వరుఁడు దొరకనిచో ౧౩ వ యేడయినను గ్రహించుటకుఁజాలియున్నది. పురుషులకో ౨౪ వ యేటఁ బ్రథమ పక్షము. ౨౦ వ యేట మధ్యమము, ౧౮ వ యేట గౌణము. వర్తమాన పరిస్థితినిబట్టి ౧౮ యేండ్లకు లోపలఁ బురుషులకు వివాహము తగదు. పుత్రవంతుఁడైనను విధురుఁడు శక్తియున్నచో ౪౦ యేండ్ల వఱకును బెండ్లి యాడవచ్చును. సంతానములేకున్న శక్యమైనచో ౫౦ యేండ్ల పర్యంతము వివాహమునకుఁ బురుషుఁడర్హుఁడు. రజస్వలయైన తరువాతఁగూడ స్త్రీ వివాహ మాపద్ధర్మముచే నంగీకర్తవ్యము. వృషలీత్వబోధకవచనముల కావివాహముయొక్క ప్రత్యవాయ హేతు త్వమందే తాత్పర్యము.

వివాహారంభమున బ్రాహ్మణాదిజాతులుం బోలె నవాంతర శ్రేణులు కీర్తింపఁబడకుండుటచే నవాంతరశ్రేణులలోని యన్యోన్య వివాహము శాస్త్రమునకు విరుద్ధముకాదు. కాని బహుకాలమునుండి వచ్చుచున్న యాచారమునకు విరుద్ధమగుటవలనఁ దత్ప్రవర్తన మయోగ్యము.

స్వార్థనిరపేక్షులును, శ్రుతిస్మృతిపురాణాది పూర్వాపరసందర్భవిదులును నగు ధర్మజ్ఞులకు సంకోచనరూప ధర్మపరివర్తనము చేయుటకే యర్హత గలదు.

బ్రాహ్మణవితంతువుల వివాహముకాని నియోగవిధిగాని కేవల శాస్త్రనిషిద్ధమే కాదు, నింద్యముగూడ.

అస్పృశ్యజాతుల యస్పృశ్యత జాతినిబట్టి వచ్చినది. వారి కూపోదకగ్రహణవిషయమునను సభాప్రవేశవిషయమునను దేవాలయప్రవేశవిషయమునను దారతమ్యము కనఁబఱుపవలయును. సభయందు వేఱుప్రదేశమును వేఱుకూపమును గోడమొదలైనవి యడ్డుగాఁగల దేవాలయమున దూరమును వ్యవస్థచేసి వారి కుపకరింపవలసినది. యవనులచే మన బావులలో నీళ్ళు తెచ్చుకొననిచ్చుట మున్నగునవి యాపద్ధర్మములయిపోయినవి. కాని హిందూసమాజమున కది కళంకమే.

భాగవతధర్మదీక్షచేత బ్రాహ్మణత్వాది జాత్యంతర ప్రాప్తి కలుగనేరదు. యవనాదిజాతి జన్మసిద్ధమైనదే. అన్నిజాతులవారికిని భక్తియం దధికార మున్నది.

దేవలస్మృతి మన్వాదులతో నేకీభవించిన చోటఁ దప్ప నన్యత్ర ప్రమాణముగాదు. కనుకనే యొక్క సంవత్సరము మ్లేచ్ఛ సంసర్గము చేసినవారు ప్రాయశ్చిత్తము చేసికొనవలసినవిషయములో

విప్రతిపత్తి లేదు. అట్టిప్రాయశ్చిత్తముచే వారిని సంఘమునఁజేర్చుకొన వచ్చును. తదధికకాలమ్లేచ్ఛసంసర్గులను జేర్చుకొనఁగూడదు.

ఎన్నితరముల వఱకు వ్రాత్యులైయున్నను సంస్కారమున కర్హులగుదురు. జాతి పుట్టుకతోడనే వచ్చును.

—♦ ౨. రామదేవత్రిపాఠిగారు — బహావారాజ, ఆరా. ♦—

భిన్నాచారవంతులును భిన్నశీలురును నగునవాంతరశాఖల వారు పరస్పరము వివాహసంబంధము చేసికొనుట వర్ణసంకరమువలె ననర్థము కొఱకే యయ్యెడిని. వివాహమునకు సమానశీలమైనను నొకనిమిత్తము గావలయును. కనుకనే యవాంతరశ్రేణులవారి పరస్పర వివాహ సంబంధము యుక్తమని తలంపము.

అస్పృశ్యజాతులయస్పృశ్యత జాతినిబట్టి వచ్చినది. శూద్రాదీతరజాతులవారిచేఁ బోలె మన బావులలోని నీళ్లు వారిచేఁ దీసికొని పోనీయఁగూడదు. సభలకును దేవాలయములకును రానీయఁగూడదు. భిన్నప్రదేశమేర్పఱచి సభలకు రానిచ్చియు భిన్నకూపము త్రవ్వించి నీళ్ళు తెచ్చుకొననిచ్చియు గోడ మొదలైనవి యడ్డముపెట్టి దూరముగా దేవాలయములఁ జొరనిచ్చియు నుపకరింప వలెను. తురకలపట్ల నంగీకరించెడి యీ పనులు నివారింప నశక్యములు. కాని హిందూ సంఘమున కిది యొకకళంకమే.

—♦ 3 గణేశదత్త నైయాయికులు - శేఖావాటి ♦—

శాస్త్రమునుబట్టి ౮ వ సంవత్సరము మొదలుకొని ౧౦ సంవత్సరముల పర్యంతమును బరిస్థితినిబట్టి ౧౧ వ సంవత్సరమునఁగూడ స్త్రీలకు వివాహముచేయుట తప్పుగాదు. ౧౨ వ యేట స్త్రీలెల్లరు రజస్వలలే. పీయూషధారయందు “ వర్షద్వాదశకా దూర్ధ్వం యది పుష్పం బహిర్నహి, అంతఃపుష్పం భవత్యేవ పనసోదుంబరాదివ ”

త్తను వచనము కనఁబడెడిని. కనుకనే ౧౨ యేండ్ల తరువాత రజస్వలా వివాహమే యయ్యెడు. అది ప్రాయశ్చిత్తములేకుండఁ జేయఁబడినఁ బితాదులు నిందితులగుదురు. ప్రాయశ్చిత్తపురస్సరముగా నాచరించిన నదియుఁ దప్పుకాదు. పురుషులవివాహము ౧౮ యేండ్లు మొదలుకొని చేయవచ్చును. ఉత్తరావధి లేదు.

మృతభర్తృకలగు బ్రాహ్మణస్త్రీలకుఁ బునర్వివాహముగాని నియోగముగాని కేవల శాస్త్రసిద్ధమె కాదు-నింద్యమును.

శాస్త్రమునకు విరోధము కానందునఁ బంచములకుఁ బృథగ్వ్యవస్థాకరణముచే సాహాయ్యము చేయవలసినదే. బ్రాహ్మణు లంత్యజులతో సంభాషణగూడఁ జేయఁగూడదను వ్యవస్థమాత్రము పరిస్థితిని బట్టి పరివర్తనీయము. జాతిచండాలురను గర్మచండాలురను నుభయులను ముట్టఁగూడదు.

మ్లేచ్ఛసంసర్గము చేసెడివారిని ౨౦ యేండ్లవఱకును ప్రాయశ్చిత్తశుద్ధులఁజేసి సంఘమునఁ జేర్చుకొనవచ్చును. కాని యా సంసర్గము సహవాసమాత్రమే యయియుండవలయును.

౮ భగవాన్ శాస్త్రిగారు.

పురుషుల యుపనయనకాలమే స్త్రీలకు వివాహకాలమగుటం జేసి యనుపనీతుఁడుంబోలె వివాహమునకుఁ బూర్వము ఋతుమతియైన కన్యకయు వ్రాత్యురాలని సర్వజ్ఞనారాయణాదులు చెప్పియుండిరి కావున ౮వయేడు మొదలుకొని ఋతుమతులగువఱకు స్త్రీలకు వివాహకాలము. శ్లో॥ వ్రాత్యయానసహసంయోగే చాండాల్యా తావదేవతు మొదలగు మన్వాది వచనములను బట్టి చతుర్వర్గచింతామణియందు వివాహమునకుఁ బూర్వము ఋతుమతియైన స్త్రీ చండాలియని ప్రతిపాదితము. ముహూర్తమార్తాండాదులయందు ౮వ యేడు మొదలుకొని ౧౦ యేండ్లపర్యంతమే స్త్రీకి

వివాహయోగ్యతయని చెప్పఁబడియెను. అది మార్చుట కొంత మాత్రము వలనుపడదు.

వ్రాత్యసంస్కారము మూఁడుపరంపరలవఱకే చేయవలెను.

——♦ ౯ పాలఘాటు వైదికసమాజ మధుర ధర్మశాస్త్రసభా కుంభఘోణ సనాతనధర్మసభా మాయూర బ్రాహ్మణసమాజ త్రిశిరఃపుర బ్రాహ్మణసమాజ చిదంబర విద్యాలయ పండితవర్గము మొదలయిన సుమారు ౧౯౦౦ జనులు ♦——

శాస్త్రదృష్టిచే నతిబాల్య వివాహముకూడ స్త్రీలకు నింద్యము కాదు. కనుకనే శాస్త్రమువలనఁ బూర్వవిధివిశేషమందు నిందకను పట్టదు. అయినను బ్రకృతపరిస్థితినిబట్టియు శాస్త్రమును బట్టియు స్త్రీలకు ౮ ఏండ్లకుఁబూర్వమును రజోదర్శనానంతరమును బురుషులకు ౧౬ యేండ్లకుఁబూర్వమును ౫౦ యేండ్లతరువాతను వివాహము కూడదని నియమించుట యోగ్యము. ఆపత్కాలప్రత్వముచే ఋతుమతీ వివాహముగూడ నంగీకరింపవచ్చును.

శాస్త్రవిరుద్ధములగు దేశకులధర్మములు ప్రమాణములగుటవలనను మఱియొకమార్గమున దేశకులాద్యాచారసంరక్షణమున కుపపత్తి లేకుండుటవలనను నాచారసాంకర్యము సంభవించును గనుకను నవాంతరశ్రేణులలోఁ బరస్పరము వివాహసంబంధము చేయఁగూడదు. ఇది సహ్యాద్రిఖండాదులయందును స్మృతి సారసముచ్చయ మందును నిషేధింపఁబడియున్నది. ప్రాయశ్చిత్తానుష్ఠానాదికమును నక్కడనే వివరింపఁబడియెను.

మ్లేచ్ఛులకంటెను నంత్యజులు జాతిచే నికృష్టులగుటవలన వారిని ముట్టుకొనఁగూడదు. బ్రాహ్మణాది సంఘమునకు సంబంధించిన కూపాదులలోని యుదకము వాడుకొనుట మొదలైన పనులయందును వీరి కర్హతలేదు. దేవాలయాదులయందును గ్రామాదులయందును దర్శనవ్యవస్థగూడ వీరికి దూరమునుండి చేయవలయును. ఒకజాతి ధర్మములయందు మఱియొకజాతివారి కధికారము లేదు. (సశేషము)

# అస్పృశ్యతా నివారణ

## అనర్థదాయకము.

ఆర్యులారా! అస్పృశ్యతానివారణయను సమస్య గాంధిమహాత్ముడు సిద్ధాంతీకరించుట కవతరించెను. యిదివరకు బ్రహ్మసమాజ ఆర్యసమాజ దివ్యజ్ఞానసమాజీకులు విధవాపునర్వివాహ రజస్వలానంతరవివాహ జాత్యంతరవివాహాదులకు ప్రాముఖ్యమిచ్చినట్లు దీని కంతగా ప్రాముఖ్యమివ్వక బీజరూపముగా "నిమ్నజాత్యుద్ధరణ"మను పేర నొకకొంతపని చేయనారంభించి మాలమాదిగెలకు ఆశ్రమములను పేర్లతో కొన్నిచోట్ల పాఠశాలాదు లేర్పరచిరిగాని సత్రములు నూతులు దేవాలయాదులలో విచ్చలవిడిగా పంచములు ప్రవేశించినగాని యైకమత్యమేర్పడి స్వరాజ్యసాధనకు సర్వమతస్థులు దోడ్పడరని మహాత్ముడు బోధించుటచేతనె యీసమస్యకు మరింత ప్రాబల్యమేర్పడినది.

యిదివరకే సంతలు దేవోత్సవములలో అనిష్టముగా నీ అస్పృశ్యత దొలగినను పూర్వాచారపరాయణులు సచేలస్నాన నూతన యజ్ఞోపవీతధారణాదులు తాత్కాలికముగా శుద్ధికొరకు చేయుచున్నారు. యిటీవల జాతిమతనియమములేని ఆంగ్లేయప్రభుత్వ మేర్పడినను వారు పంచమస్కూళ్ళు మహమ్మదీయస్కూళ్లు ప్రత్యేకముగా నేర్పరచి ప్రత్యేకగ్రాంటు లిచ్చుచున్నారు. హిందువులును కాలేజి తరగతులకు దప్ప హైస్కూలు తరగతిబాలురకు హిందూహైస్కూళ్లు పలుచోటుల నేర్పరచుకుని పంచముల స్పర్శ నంగీకరించరైరి. యిప్పటికి "సంత సర్కారులో సంగడిరైలులో స్కూలాసుపత్రిలో సురిగె మైల" యను స్థితికి వచ్చినది. యిప్పటికి ప్రజలలో సంఘ సంస్కారులు పూర్వాచారపరాయణులని యిరుతెగ లేర్పడినవి. యిందు పూర్వాచారపరాయణు లిరుదెరంగులుగా నున్నారు. అందుకొందరు పైనపేర్కొనిన సంతలు సర్కారుపటకుటీరములు నదీయాన పాత్రలు రైళ్ళు కాలేజీలు ఆసుపత్రులు మున్నగుచోటుల రాజకీయముగానేమి సాంఘికముగానేమి విధిలేక పంచమాది స్పర్శ నంగీకరించు చున్నారు. పట్టణాదులయందలి సిటిపంపులలోని నీరు పంచములంటినను త్రాగు

డురు. గాని బావులలోని నీరట్లు ముట్టనివ్వరు. దేవోత్సవములలో
పంచముల నంటినను దేవాలయములలోనికి పంచములు ప్రవేశించుట
కంగీకరింపరు. ఇట్లనే ధర్మసత్రములలోసహా చాతుర్వర్ణులకు వేర్వేరు
గదు లంగీకరింతురు. గాని కలయుట కంగీకరింపరు. పంచముల నసలే
ప్రవేశింపనివ్వరు. కారణమేమన: ఇది యొక తెరచాటు. అనగ భార్య
యొక్క మర్మావయవములు మైథునకాలమందు భర్త వీక్షించినను
అభ్యంగనకాలమందు మంచములుమున్నగునవి అడ్డుజేసుకొనినట్లగును.
ఆమాత్రపు తెర దీసినచో స్త్రీపురుషులకు వస్త్రాద్యాచ్ఛాదన అక్కర
లేనట్లగును. నేనీ తెగలోనివాడనగుటచేతనే జీవపితరులుగాని నిర్జీవపితరు
లుగాని సముద్రయానముజేసి విదేశములలో కొన్నియేండ్లుండి వచ్చిన
వారికి ప్రాయశ్చిత్తము శాస్త్రములు ఒప్పుకున్నను అన్నిబ్రాహ్మణ
సంఘములతోపాటు నామమాత్రప్రాయశ్చిత్తము చేసినచో వారి
సహాపంక్తిని భుజించినవాడనే; భుజించనున్నవాడనే; గావుననే దేశో
ద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి దుర్గావిలాసభవనమందు గడ
చిన కృష్ణాష్టమి సందర్భోత్సవకాలమందు శ్రీరావుగారొసంగిన
ద్రవ్యసహాయ మంగీకరించి శ్రీవారి దుర్గావిలాసభవనమందే హరి
కథా కాలక్షేపాదు లాచరింపజేసిన బ్రహ్మశ్రీ చెరువు అనంతరామ
సోమయాజులుగారితోపాటు భక్తసమాజ మెంబరునయిన నేనును
అతిపూర్వాచారపరాయణుడగు బ్రహ్మశ్రీ వీరభద్రపాకయాజిగారి
విమర్శకు పాత్రుడనైతిని. రెండేండ్ల క్రిందట అతిమూత్రవ్యాధిచే
చెవులో కురుపువేసి గుంటూరు జనరల్ అస్పత్రిలో పాకిసోదరునిచే
శయ్యానిర్మాణాది వుపచారమును చన్నపురి జనరల్ ఆస్పత్రిలో
మిస్టర్ బెంజిమేన్ డాక్టరుగారిచే అవుషధము వేయించుకొను సహా
కారమును పొందితిని. గాని నావంటి రెండవతెగవారు ముట్టుకొను
అభిప్రాయము పంచముల సోదరత్వమునకై గాక స్వార్థపరత్వము
చేతనే నని గ్రహింపుడు. పంచముల నుద్ధరించుటయన యిప్పటి నవ
నాగరికులు పేరిడిన "నిమ్నజాత్యుద్ధరణమే"నని ముమ్మాటికి నమ్మి
కార్యాచరణమునకు గడంగుడు. దీనిభావమునే మనపూర్వులు వైశ్వ
దేవకాలమందు "బలి" వేయునపుడు శ్వానపతితచండాలవాయ
సేభ్యః ఇమంబలిం దదామియను మంత్రముతో అన్నపుముద్ద (కబ

శము)ను వేయుదురు. ఇట్లు పూర్వాచారపరాయణులలోని ధార్మి కులు తనకంటెముందు పంచమాదుల కన్నమిడరుగాని భోజనానంతరం "అన్నస్యక్షుధితంపాత్ర"మను నీతిమేరకు చండాలాది సర్వమానవులకు అన్నమిడుట మనము చూచుచున్నారము. అందరట్లొనర్చుచున్నారాయ నిన నవమాసములుమోసి కనిన తల్లి కన్నమిడక జీవనార్థమైకోర్టుల కెక్కించిన సోదరులనుకూడ జూచుచునే యున్నాముగాన నిమ్న జాతియని కొందరున్నారని సంఘసంస్కర్తలిడిన నూతన నామమే గాని అన్నవస్త్రముల కల్లాడు ప్రతివాడును దానార్హుడే. పైజాతికి క్రిందిజాతులవా రందరు అస్పృశ్యులే, ఇంతయేల. కలియుగ ధర్మ ముల బోధించు పరాశరస్మృతిలోని 'ఆచారప్రాయశ్చిత్త కాండలు' అమలులోనున్నంతకాలము భార్య భర్తకు-పుత్రుడు తలిదండ్రులకు ఇట్లనె ఆయాజాతాశౌచ మృతాశౌచరజస్వలాదిసందర్భములలోఅస్పృ శ్యత పాటింపకపోరు. ఒకవేళ వుత్తరాదివారగు వుత్కలమైథి ల్యాది మత్స్యభుక్కులగు పంచగౌడులు శూద్రానీతజలపానాదులుజేసి అస్పృశ్యత నంతగా పాటింపకున్నను ఆంధ్రద్రావిడకర్ణాటాదిపంచ ద్రావిడులు మాత్రము దేవాలయములు, నూతులు, సత్రములు మున్నగు వానిలో పంచములు ప్రవేశించుటకు తమ బొందిలో ప్రాణ ములున్నంతకాలము సమ్మతింపరు. అయితే ననుబోటి అర్ధపూర్వా చారులు (పూర్వాచారులలో రెండవ తెగవారు) కారణాంతరములచే నస్పృశ్యుల నంటుకొను వుద్దేశ్యము వేరు. సంఘసంస్కారులు అంటు కొనువుద్దేశ్యము వేరు. సంఘసంస్కారులు నస్పృశ్యుల నంటుటచే సర్వమానవసోదరత్వ మలవడి సాంఘికబల మేర్పడునందురు. మేమ ట్లంగీకరింపము. అంటుటచేగాక ఆర్థికసహాయమే అయికమత్య కారణ మని మాతలంపు. స్త్రీపాలిండ్లు పుత్రుడంటుకొనుభావన వేరు. భర్త ముట్టుకొను భావన వేరు. ఫలముగూడ భావనానుసారమని శాస్త్రా నుభవసమ్మతము. యిదివరలో నవాబు సేనచే జంపబడకుండ తనను కాపాడిరని దానికి ప్రత్యుపకారముగా మేలుకోట దేవాలయమువద్ద నొకరోజు నీలఅస్పృశ్యులు సమీపించుటకు శ్రీమద్రామానుజులుగా రును యిటీవల వేదాంతి వేమనయోగిగారు నివృత్తిమార్గబోధనలోను

పల్నాటి బ్రహ్మనాయుడుగారు "చాపకూడు" కుడిపించుటలోను నీ అస్పృశ్యత తీసివేయుటకై ప్రయత్నించిరిగాని మహాత్ముడనబడెడి గాంధిగారి స్వరాజ్యసాధనలో కార్యకారియైనట్లు అపుడు కార్యకారి గాలేదు. "కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణసంకర" యన్న వాక్యముమేర కావత్సరమే మాబ్రాహ్మణి మిష్టర్ గోవిందరాజులు నాయుని ఇటీవల మా రుక్మిణమ్మ అరండేలుదొరగారిని మొన్న మొన్ననే మా అయ్యంగారికుమార్తె అబ్దుల్ కరీంగారిని విధివంతముగా వివాహములాడి హిందూ క్రైస్తవ మహమ్మదీయమతముల నైకమత్య రూపసాంకర్యము (కలయిక) సమకూర్చిరిగాని ఇట్టివి కొన్ని సంకరములు వేళ్ళమీద లెక్కించదగినవే జరిగినవి. సంకీర్ణమునకు పునాదులేర్పరచుటకు తగిన బ్రహ్మ, ఆర్య, దివ్యజ్ఞాన గాంధి మతము లేర్పడినను మనపూర్వులు కలియుగమునకు నాలుగులక్షుల పైచిల్లర వేలవత్సరములు నిర్ణయించిరిగాన అం దొకపాదమైనను గడువకముందే జనసామాన్య మీసంకరము (అస్పృశ్యతానివారణము) నకు అంగీకారము మనస్ఫూర్తిగా నొసంగరుగావున అయికమత్యమునకు భంగకరమగు, దేవాలయములు, సత్రములు, నూతులు మున్నగు ధర్మసంస్థలలోనయిన పంచములు ప్రవేశించకుండునట్లు జాగరూకతతోనుండుడు. మొన్నసీమధ్య నుత్తరదేశీయుడగు "బజాజు" గారు శ్రీ లక్ష్మినారాయణదేవాలయములోను శ్రీ కాశీవిశ్వనాథుని ఆలయములోనికి పండితుడనబడెడి మాలవ్యాగా రొక దొరసాని గారిని ప్రవేశింపచేయుటలోను ఇట్లనే తిరుచానూరుదేవాలయములో మాలదాసరి ప్రవేశించుటలోను జరిగిన కలవరము పత్రికలలో చదువుచున్నారముగాన అయితే బజాజుగారు గాంధిగారి ఖద్దరు నిర్మాణమునకు దోడ్పడిరను సంతసముతో నిప్పుడే మరికొన్ని ఆలయముల లోనికి పంచమాదులు ప్రవేశించవచ్చునని చంక లెగురవేయుచున్నారుగాని అయ్యది గాంధిప్రశిష్యుడగు స్వర్గీయరామదాసు గోపాలకృష్ణయ్యగారిపేర నిర్మించు ప్రత్యేకఆలయములో సాధ్యపడునుగాని పూర్వధర్మసంస్థలలో నిట్టివి సంభవింపజేసినచో అయికమత్యమునకుమారు అనర్థమే వాటిల్లునుగాన అట్లొనర్చకుండుడని గోరుచున్నాను.

మండ చినవెంకయ్య - ప్రాక్టికల్ వాది.

ఆ॥ అసురదర్పహారి యగు భగవానుండు వైబుధీయపళముసం బ్రతిష్ఠి
తుఁడయి గేస్తు పగలుఁ ద్రుంచెడి సర్వదా. యట్లుగాన విష్ణు నచట సునిచి. ౫౧౯

ఆ॥ గంధపుష్పములను గమ్మని వంటకంబులను జేయవలయుఁ బూజనంబు
వాయుకోణమందు వరుస నంబికనుంచి కొలువవలయుఁ గులము నిలుచుపొంటె.

ఆ॥ వేనిమహిమ బ్రహ్మవిష్ణ్వాదులును లిఖింపంగఁజాల రట్టిభవుని శ్వేత
పుష్పములను సతముఁ బూజించునది యాపమృత్యుముఖర దోషబృంద మెడల.

క॥ ఏతత్పంచాయతనము భూతలమున గేస్తులెల్లఁ బూజింతురు కా.
ఈతప మెపుడుం గార్యము. చాతుర్మాస్యఁ గృతమైనఁ జాలఫలంబౌ. ౫౨౦

ఆ॥ అన్నిపర్వవేళలందును గృతమైన దానధర్మములును దపమయగును.
అది యనంతఫలదమగును. జాతుర్మాస్యసమయమందు శ్రద్ధ సల్పఁబడిన. ౫౨౧

ఆ॥ బాహ్య మాంతరమనఁ బరగును శౌచంబు ద్విప్రకారమగుచు విప్రముఖ్య!
జలకృతంబు బాహ్యశౌచంబు. శ్రద్ధమై నాచరించుశౌచ మాంతరంబు. ౫౨౨

ఆ॥ ఇంద్రియముల నిగ్రహించుట యొకతపం. బింద్రియముల లౌల్యమెల్ల నణఁప.
నది మహాతపంబటంద్రు చాతుర్మాస్య నింద్రియార్థనియమి యైనయతుసుఖము.

ఆ॥ ఉత్పథమునఁజనెడి యుర్వింద్రియంబులే నరకమునను ద్రోయు నరుని. గాన
మమతయనెడి దుష్టమతియైన మొసలిని నిగ్రహించుటొప్పు నిరత మనఘ! ౫౨౪

ఆ॥ అదియు నొక్కతపమె యగును. జాతుర్మాస్యమందదైన నదుమహాతపంబు.
కామమును జయింపఁగలవా గ్మహాత్ములు. అఖిలజగము గెలిచినట్టి వారు. ౫౨౫

క॥ కామంబును సంకల్పము నేమనుజుఁడు గెల్చు వానిదే జ్ఞానమనం.
గా. మూలమదియె తపమున కోముని యది హరిపరుండ నురుతపమగుఁజూ. ౫౨౬

తే॥ లోభ మెపుడును దుఃఖంబు. లోభమంటఁ గిల్బిషంబుండు. నద్దానిఁ గెల్వ తపము.
హరిపరుండిన సమయమం దట్టిగెలుపు మహితతపమనఁబడుఁజెక్కుమాటలేల. ౫౨౭

తే॥ మోహ మవివేకమును సదా మొనసి విడువఁదగును నారద! వానిచేఁ దృప్తుఁడైన
వాఁడె యగు జ్ఞాని యవ్వాని వదలకున్న నెన్నియున్నను నజ్ఞానియే నరుఁడు.

ఆ॥ మదము దేహమందు మను వైరి జనులకు. దాని నిగ్రహింపనౌను సతము.
హరిపరుండుసమయమం దవశ్యంబొకొ మిమ్మదంబు నిగ్రహించు టన్న ౫౨౯

క॥ మానము భయదాబగుచును దానుండును సకలభూతతతియందును. న
ద్దానిని క్షమచే గెల్వఁగనౌ. నది హరిశయనవేళ నధికఫలంబౌ. ౫౩౦

ఆ॥ అధికపాపకారియైనట్టి మాత్సర్యమును జయింపవలయు మొనసి ప్రాజ్ఞుఁ.
డట్లు హరిశయుండునపుడు జయించుచోఁ దిగజగముల సురల నోగిజయించు. ౫౩౧

క॥ మునులు జితేంద్రియులయ్యును దనయా! యహంకారమునఁ దావలమగుచున్
ఘనధర్మమార్గమును విడి యనయంబు నమార్గగాములగుదురు చూవే. ౫౦౪

ఆ॥ కాన నెప్పుడు విడువనౌను నహంకృతి. యందువలన ఫలము ననుభవించు.
నట్లు హరిపరుండు నప్పుడు విడుచుచో నధికఫలముగలుగు ముని వరేణ్య!

క॥ మనమున నేతత్త్యాగం బనునది తపమునకు మూలమగు నారద! వీ
నిని వదలి శుద్ధమతియై మనుమనుజుఁడు బ్రహ్మమయుఁడు మహిఁ బరికింపన్.

ఆ॥ మొదలు కాని శుద్ధిపొందెఁ బ్రాజాపత్య మాచరింపవలయు నవనిజనము.
హరిపరుండు సమయమందె యొనర్చుచో నది మహాతపంబటండ్రు బుధులు.

క॥ హరిశయనవేళ నేకాంతరమైన యుపోషణము సతంబును జేయున్
నరుఁడు యమాలయమునకేఁక నరుగఁడు నారదమునీంద్ర! యఘవిరహితుఁడై.

ఆ॥ హరిపరుండు నెడల నహరహమును నరుం డేకభక్తమును సహించెనేని
ద్వాదశాహఫలము తప్పక కలిగెడి దినదినంబు నతనికిని మునీంద్ర! ౫౦౭

సీ॥ ఎవఁడు చాతుర్మాస్య నవును శాకాహారి క్రతుసహస్రఫలంబు గలుగు వాని
కెవఁడు చాతుర్మాస్యఁ దవిలి చాంద్రాయణ మొనరించుఁ దత్పుణ్య మూర్జితంబు
ఎవఁడు చాతుర్మాస్య నెంతయుఁ బారాక మాచరించును వాని యఘములడఁగు
ఎవఁడు చాతుర్మాస్యఁ గృచ్ఛ్రసంసేవియౌ నైకుంఠముననుండు వాఁడు ఘనత
ఏపుమాంసుఁడో మునీశ! చాతుర్మాస్యఁ దప్తకృచ్ఛ్రపరతఁ దావసించు
వాఁడిహమునఁ బుత్రవంతుఁడై విష్ణుసాయుజ్యమొందుఁ గీర్తి యుర్వి వెలయ.

సీ॥ దుగ్ధపానమునఁ జాతుర్మాస్య గడపినఁ బాపసహస్రముల్ రూపుమాయు.
మితమైనయన్నంబు మెసవఁ జాతుర్మాస్యఁ గొలలం దొలంగి నైకుంఠ మొందు.
ఏకాన్నభోజన మెలమి జాతుర్మాస్యఁ జేసినఁ దెగుగులు చెందు లయము
అక్షారలవణాశి యైనఁ జాతుర్మాస్య బ్రహ్మహత్యాదిపాపములు వాయు.
ఉదకములను ద్రావి యున్నఁ జాతుర్మాస్య నహరహంబు గూడ నశ్వమేధ
యాగమాచరింప నబ్బెడిఫలమబ్బు సంశయంబులేక సంయమీంద్ర! ౫౦౯

తే॥ కందమూలాశనుండైన ఘనుఁడు తన్నుఁ దనదు పూర్వుల ఘోరపాతకమునుండి
యుద్ధరించుటయే కాక యొందుఁ బోయి విష్ణుసాలోక్యమును దాను విద్వదగ్ర్య!

క॥ చాతుర్మాస్యను విష్ణుప్రీతికిఁగా నెవఁడు శీతవృష్టి సహించున్
పీతాంబరుఁడగు శ్రీహరి యాతని కగు వశుఁడు నారదా! వింటివొకో.

ఆ॥ మాసమంతయును నుపవాసంబులుండిన నది మహాపరాక మనఁగఁబడును.
హరిపరుండయున్న యానాల్గునెలలలో నొకటనేని దాని నొనరుపవలయు.

కం॥ ఎవఁడిది భక్తి నొనర్చునొ యవు విష్ణువు వాఁడు. తపములన్నిటిలోనన్
బువినిది మహితతపంబగు. నవనంబులకన్నఁ బెద్ద చాతుర్మాస్యన్. ౬౯౫
ఆ॥ దుర్లభంబు మఱియు దుష్కరంబగు నీమహాతపంబుఁజేయు సకలుమానవు
ప్రతిదినంబునందుఁ బదివేలయజ్ఞము ల్సలిపినంతఫలము గలుగఁగలదు.
సీ॥ ఈమహాపారాకమే మహాపుణ్యంబు. నీమహాపారాకమే సుఖంబు.
ఈమహాపారాకమే కడు శ్రేయంబు. నిదిసేయువానిమే సెవయు శౌరి.
జ్ఞానంబు వానికిఁ గలుగుఁ బాతకయుక్తుఁడయ్యు జీవన్ముక్తుఁడగు నతండు
మాసోపవాసియొ మట్టుకేగర్జించు నఘములు నరకంబు లంతనఱకె
మాయలంతనఱకె మఱియుఁ జాతుర్మాస్య నుపవసించియున్న యుర్వ్యమరుని.
నతిథిఁజేయువాని హత్యాసహస్రసంజనితపాపములును క్షయము గాంచు. ౬౯౬
ఆ॥ ఎవ్వఁడీపురాణ మితరులకును సుబోధముగ వినుచుఁ జదువుఁ దవఁడెపాను.
వాఁడుగూడ గురునివంటివాఁడై ఫలం బనుభవించు సంశయంబులేక. ౬౯౭
క॥ పరమపవిత్రంబగు నీపురాణమును మానసమునఁ బురుషోత్తము సు
స్థిరముగనుంచి పఠించిన సురలకు దుష్ప్రాప్యమైన సుధ లభియించున్" ౬౯౮

—♦ తపోధికారము. ♦—

వ॥ అని యిట్లు చెప్పుటయు నారదర్షి. ౬౯౯
తే॥ "షోడశోపచారంబుల చొప్పదెట్లొ హరిపరుండంగ నిత్యంబు నాచరింప
నుచితమైనట్టి యాషోడశోపచారములును సెయ్యవో వివరించి తెలుపుమయ్య."
వ॥ అని యడుగుటయుఁ బద్మయోని మఱియు నిట్లనియె. ౭౦౦
కం॥ "శ్రుతిశాస్త్రవిధానముచే నతివృద్ధముగ విష్ణుభక్తి యాచరణీయం
బు తనూజా! ఇదియంతయు శ్రుతిమూల మనాది హరియు శ్రుతి పఠింపన్.
తే॥ బ్రాహ్మణాధారములు శ్రుతుల్. బ్రాహ్మణుండు వహ్ని యారాధనముచేయువాఁడు
[ వాఁడు
యజ్ఞమున దేవునర్చించు చాశ్రియాశమందుఁ బ్రాస్తాహుతి జితేంద్రియా!
కం॥ హరిపూజారతమగుప్రజ నిరతము ధరియింపఁజేయు నిఖిలజగంబున్. [ మునీంద్ర!
స్మరణమునే యగఁబడిహరి హరియించు నశేషమైన యఘౌఘంబుల్.
కం॥ జలరూపంబును దాలుచు జలజాయతలోచనుండు చాతుర్మాస్యన్.
దలఁచుకొనఁబడిన యెడలను విఱయించు విశేషముగను వెతలు మహర్షి!
తే॥ ఉదకమునుండి యన్నంబు లుద్భవించె. హరిశరీరాంశ సంభూతమైనయన్న
మగునఁ బ్రహ్మను. దానిని హరికినిలిచి యిడ జరింపఁజాదు తేప్పడవు నిండ

సీ॥ ఆకాశమునసుండి యాది ఋగ్వేద మొక్కటియె యేర్పడెంగాని క్రమముగాను.
జగతి యజుస్సామసంజ్ఞలుగలది సహస్రశీర్షమును నారాయణమయ.
మయి షోడశార్చ్యల నలరారుచును మహాసూక్తంబటంచుఁ దాఁ బ్రోక్తమయ్యె.
తత్పాఠమాత్ర నెంతటి బ్రహ్మహత్యయు నడఁగును. బుధుఁడైన యవనిసురుఁడు
స్వీయదేహమునను స్మృత్యుక్తమున న్యసించునది మొదటఁ. బిదప శుద్ధమయిన
సురుచిరప్రతిమల మఱియు సాలగ్రామములను నొగి న్యసింపవలయు లలిని. ౬౦౬
సీ॥ వైకుంఠపురమున వర్తించునట్టిఁడు కౌస్తుభమణిచేఁ బ్రకాశమానుఁ
డర్యమకోటితుల్యప్రభాసహితుండు పంచశాఖస్థిత భవ్యదండుఁ
డఖిలపాపసమూహహరణుండు శిఖయును సూత్రంబు గలిగిన సుందరుండు
పచ్చరంగు హొంబట్టు పుట్టముగట్టి చెంపెసలారెడిభిక్షురాట్టు
నైన విష్ణురూప మావాహనముచేసి పూజసేయవలయుఁ బూర్ణభక్తి.
ఆవిధంపుఁబూజ యల్లచాతుర్మాస్యమున విశేషఫలదమని వచింతు. ౬౦౭

— ♦ షోడశోపచారపూజ ♦ —

ఆ॥ ధ్యానసంస్థుఁడైన తద్విష్ణుభగవాను బ్రణవముఖకములను బరఁగునట్టి
ఆదిఋక్కుచేత నావాహనముచేయవలయుఁ బ్రథమమందుఁ గలహాశిల! ౬౦౮
తే॥ పార్షదులతోడ సహితుఁడై పరగుచున్న హరినిగుఱియించి సౌవర్ణ మాసనము ద్వి
తీయఋక్కునఁ గల్పించి యీయవలయు. భూరిభక్తిని నది పరిపూర్ణమగును ౬౦౯
తే॥ పాద్యము తృతీయఋక్కున హృద్యముగను సేవవలయును గంగను సంస్మరించి.
నాలుగవఋక్కుచే నర్ఘ్య మొలి విడుచునది సరిత్తులతోడ సప్తాంబుధులను. ౬౧౦
తే॥ మఱి జగన్నాథునకు నాచమనము చేయనగును శుద్ధోదకమున. మూఁడాచమనము
లాచరించిన బ్రాహ్మణుఁ డగును శుద్ధుఁ. డాచమనవారి ప్రకృతిస్థమగుట లెస్స.
సీ॥ ఫేనబుద్బుదముల హీనమౌ నుదకంబు హృత్ప్రమాణంబుగా శుద్ధినొనయు ద్విజుఁడు.
కంఠగంబుగా క్షత్రియునకుఁ దాలుగతముగా విశునకుఁ గలుగుశుద్ధి
స్త్రీయును శూద్రుండుఁ జేత జలంబుల స్పృశియించియే శుద్ధిఁజెందఁగలరు.
భక్తియుక్తంబుగం బంచమఋక్కుచే నాచరితవ్య మయ్యాచమనము.
భక్తిచేతనె గ్రాహ్యుండు పద్మనాభుఁడాత్మనిచ్చును భక్తిచే నతఁడు సరిగ.
ఆచమనమైనపిమ్మట నాఱవదగు ఋక్కుచే స్నాన మొగిని జేయింపవలయు.
సీ॥ నిఖిలౌషధీరసాన్వితము భర్మఘటసంస్థితముచు మఱి సువాసితము నైన
జలమున మనసుచే సమున్నతంబైన తీర్థోదకమునను దేవునకును

స్నానంబుఁ జేయింపనౌను గరము శ్రద్ధ-నశ్రద్ధ దత్తమౌనట్టి రత్న
రాశియైనను ఫలరహితమౌ శ్రద్ధచే నర్పిత జలమే ననంతఫలద
మట్టిశ్రద్ధతోడ నట్లు చాతుర్మాస్య నర్పితస్వల్పమైన నగుఁ బవిత్రుఁ.
డంత వస్త్రదాన మాచరించ్య మేదవదిమైన బుక్కున వినువుకసు ౬౧౩
క॥ ఆచ్ఛాదింపఁగఁబడుజగ మాచ్ఛాదింపంగఁబడిన హరివస్త్రముచే.
ఆచ్ఛాదనదానం బోనచ్ఛల ! మహాఫలంబు చాతుర్మాస్యన్. ౬౧౪
ఆ॥ విష్ణురూపమైన భిక్షునకుం బునగాదనునను నొసఁగవగు మునీంద్ర !
అంత యజ్ఞసూత్ర మట్టివ బుక్కుచే నీయవలయు. దానిచాయ వినుము. ౬౧౫
సీ॥ దానిసంస్పర్శంబు భానుకోటిస్పర్శమున కనురూపమై తనరు ఘనత.
అనవరతంబును నత్యధికముగ విరాజమానంబది తేజుతోడ
ఆగ్రహహారితుండగు విప్రునం దది సౌరామణీకోటిసమతఁబరఁగు
బ్రహ్మవిష్ణుమహేశ్వరస్వరూపంబును వేదమయంబునై వెలయునది.
సవితృచంద్రవహ్నిసంగమమున బుణత్రయముచేత సంయుతంబునది.
తత్ప్రభావమునను దా ద్విజన్ముండుగాఁ జెప్పఁగఁబడెడుఁ బృథివి జనుఁడు.
సీ॥ జన్మ బుచే శూద్రశబ్దవాచ్యుండును సంస్కారమున ద్విజశబ్దవాచ్యుఁ
డతఁడు శాపానుగ్రహసమర్థుఁ డట్లు కోపంబు ప్రసన్నత బ్రాహ్మణునివె.
త్రైలోక్యమునయందుఁ బ్రవరుండు నాఁగను బ్రాహ్మణనామంబె పలుకఁబడెడుం
బ్రాహ్మణసముఁడైన బాంధవుఁ డొకఁడేని కలుగదు తత్సర్వగతి మునేని.
సచర మచర మైన జగతీత్రయంబునం దొకఁడు బ్రాహ్మణునకు నుద్దిగాఁడు.
హరిపరుండునెడల యజ్ఞోపవీతి బ్రాహ్మణుఁడు చేయు నఖిల మాత్మమయము.
ఆ॥ అఖిలజగముగురుఁడు హరి యత్యుకర్దయలిప్పుఁడగుట దాన లేపనంబు
సవన బుక్కుచేత సవనరూపున కాచరింపవలయుఁజూ నిలింపమౌని ! ౬౧౭
క॥ ఈ నిఖిలంబగులోకం బా నారాయణునిచేత వాప్యాయితి. మా
శ్రీవాయువు సత్కీర్తినెకా నారద ! వాసితంబు కడు దగమెల్లన్. ౬౧౯
సుగంధి॥ తేజమునను సూర్యుఁడగుచు దేవభావమొంది వి
భ్రాజమానమైన యట్టి బ్రహ్మమూర్తిపదములన్
రాజిలంగఁగలదు చందనంబు హరి కొసంగుహో
ష్మాగ్రసం బిఁకేమి నీకు సంయమీ ! వచింపదున్. ౬౨౦
క॥ చందనలేపముచేఁ గడు సుందరుఁడగు నందసూనుఁ జూచిన భాస్వ
న్నందను మందిర మొందరు. సందియమే యందులకిఁకఁ జాతుర్మాస్యన్. ౬౨౧

ఆ॥ దశమబుధ్ధిచేతఁ దగఁ బుష్పపూజయు భక్తిపూజ చేయవలయు నట్లు.
పుష్పగర్భమందె పూజ్యురాలగు లక్ష్మి రహిఁ వసించుఁ దా నిరంతరంబు. ౬౨౨
తే॥ సర్వమయుఁడయ్యు విష్ణు వేచాట దోషముల స్పృశింపంగఁబడఁడొ యాలలిని లక్ష్మి
యును సతీత్వంబు లోపింపకుండ నుండు సర్వమయుయయ్యు నారదసంయమీంద్ర!
ఆ॥ ఎల్లప్రతిమలందు నిలఁగల మనుజాది సర్వభూతములను సంతతంబుఁ
బూలతోడిపూజ పొసరింపఁదగినది దేవతల పితౄళ్ళ తృప్తిఁబొంటె. ౬౨౪
ఆ॥ అబ్ధికూఁతుతోడి హరి యొక్కఁ డెవనిచేఁ బూజసేయఁబడునొ పూలచేత
బ్రహ్మ మొదలు స్తంబపర్యంతమగు జగం బతనిచేత నగును నర్చితంబు. ౬౨౫
ఆ॥ అట్లుగాన విష్ణు నవదాతసుమములఁ బూజసేయవలయుఁ బూర్ణభక్తి
ననయ. మధికఫలదమగును జాతుర్మాస్యయందె యట్టిపూజ యాచరింప. ౬౨౬
ఆ॥ భక్తిసహితమైన ప్రసవార్చనంబున నభిమతార్థసిద్ధి యగును సతము.
ప్రసవశోభి హరికిఁ బ్రణతుఁడౌ నొరుఁడును క్షయవిహీనమైనజగము బొందు.
క॥ ఈపని చాతుర్మాస్యను నేప్రజ చేసినను గలుగు నెక్కువఫల మో
శాపాయుధ! యేకాదశి ధూపము యతిరూపుఁడగు విధువునకు నిడనా. ౬౨౮
శ్లో॥ వనస్పతిరసో దివ్యో గంధాఢ్యో గంధ ఉత్తమః
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం. ౬౨౯
శా॥ ఈమంత్రంబును జెప్పి యాగురుజమై యేపారు ధూపంబు త
ద్భూమీభర్తకు నిత్య మిచ్చునది. చాతుర్మాస్య నింకన్ ఫలం
బౌ. మాంసీజటలన్ సితామధువులన్ వ్యాప్తంబు బాహ్లీకమున్
సోమంబుం గలదైన ధూపమిడినన్ సూనూ! బలిధ్వంసికిన్. ౬౩౦
ఆ॥ క్రతుభుజులు తనూజ! ఘ్రాణంబువలనను గంతసించుచుండ్రు సంతతంబు
ఘ్రాణహారము ధూపకర్మంబు. గావున నర్పణీయమద్ది హరికి భక్తి. ౬౩౧

## —♦ దీ ప మ హి మ. ♦—

క॥ ద్వాదశబుధ్ధిన దీపం బొ దేయము ముక్తికాములగువారల కో
భూదేవా! తేజోవిభవౌ దీపము ముఖ్యమగును నఖిలక్రియలన్. ౬౩౨
శ్లో॥ దీప స్తమౌఘనాశాయ దీపః కాంతిం ప్రయచ్ఛతి
తస్మా ద్దీపప్రదానేన ప్రీయతాం మే జనార్దనః. ౬౩౩
ఆ॥ వేదబుధ్ధితోడ విహితమైన పురాణమంత్రమిది కుమార! మహితదీప
దానమునఁ బ్రియుక్తమై నశింపఁగఁజేయుఁ గల్మషములు. శేముగలదు చెప్ప.

శా॥ చాతుర్మాస్యమునందుఁ జక్రియెదుటన్ జాజ్వల్యమానంబుగా
జ్యోతిన్నిల్పినవాని పాతకపురాసుల్ దహ్యమానంబులౌ.
శ్రీతిం గృష్ణునియాలయంబునను దివ్వెం బెట్టు పర్యంతమే
భీతుండయ్యెడుఁ బాపి. పాపములు నిర్భీతాత్మ గర్జించెడిన్. ౬౩౫
శా॥ దీపంబున్ దరిసించుమాత్రమున సిద్ధించున్ సమస్తంబు శ్రీ
గోపాలాలయమందు దీపమును నేకోర్క్రెం బ్రతిష్ఠించునో
పాపింపంగలఁ డద్దులేక యది పుత్రా! చక్రి నిద్రించుచో
దీపారాధనచేయునట్టిఁ డెనయుం దృప్తిన్ ఫలం బెంతయున్. ౬౩౬
క॥ పంచాయతనస్థలముల నంచిత తత్పంచ దేవతాయతనములం
దుంచునది దివ్వె త్రిజగత్పంచారా! తప్పకుండఁ జాతుర్మాస్యన్. [నిచ్చు ముక్తి
తే॥ అర్చితుఁడు ధ్యాతుఁడును స్తుతుఁడగుచు నొకయెడ పేర్మిఁ దానంద మొందుచో
ముక్తికొఱ కిచ్చునది విష్ణుమూర్తి కెపుడు స్వగృహమందునఁగల శుభవస్తువెల్ల.
క॥ శ్రీపతిదీపం బన్యద్దీపంబునకన్న మిన్న. శ్రీపతియే చూ
నాపాలిటి యైశ్వర్యం బోపుత్రా! కోరకుండ నొనరిన దదియున్." ౬౩౯
వ॥ అనియిట్లు వక్కాణించుటయు నారదమునీంద్రుండు ౬౪౦
ఆ॥ "మాధవాలయమున మంత్రపూర్వకముగా దినదినమునఁ బెట్టు దివ్వెకంటె
నధికఫలద మెట్టులగును జాతుర్మాస్యమందుఁ బెట్టుదివ్వె యబ్జయోని!" ౬౪౧
వ॥ అనవుడు సురజ్యేష్ఠుండు ౬౪౨
సీ॥ "పులుఁగుతత్తడి రాతెపో యధిదైవంబు సంతతంబును నాకు సంయమీంద్ర!
చుట్టుకైదువుజోదె మా పూజనీయుండు నిరతంబు నాకు మునిప్రకాండ!
మనుగాడ్పుదిండి పానుపునఁ బండెడు నామేటి ధ్యానింతు సతమేను దాపసేశ!
పసిడిపుట్టముదాల్చి పరఁగు వైకుంఠుండు నాకంటె నుత్కృష్టుఁ డోకుమార!
అట్టిహరి కభీష్టమగు దీపదానంబుఁ బాపహరకంబు భక్తవర్య!
అది విశేషముగను నల్ల చాతుర్మాస్యఁ గామసిద్ధికరము ధీవదగ్ర్య! ౬౪౩
క॥ వెన్నుఁడు దీపమునం బలె జన్మముల సహస్రమునను సంతుష్టుండై
తన్ను భజించినజనులకుఁ దిన్నగ వరమీఁడు తనయ! తెలియునో లేదో
ఆ॥ అల్పమైనయట్టి వ్యయమున దీపంబు నిల్పవచ్చు ఫల మనల్పవద్ది
హరిపరుండఁ బెట్టు నాదీపఫలంబు నెంత యనిగణింప నేరితరము? ౬౪౫
తే॥ కాన సర్వాత్మభావనఁ గరము శ్రద్ధ హరికిఁ బ్రీతిరూపమైనట్టి యతికి దీప
దాన మొసఁగింపఁ [illegible] స్వస్తించె. [illegible]

ఆ॥ అట్లు దీపదాన మగుడుఁ ద్రయోదశబుధ్యాచేత హరికి మృష్టమగుచు
వెలయునన్నమును నివేదింపవలయుఁజూ భక్తియుక్తులగుచుఁ బ్రజలు తనయ!

ఆ॥ అమృతముం ద్యజించి యా యన్నముం గోరు నమరులును గృహస్థు సంగణంబు
గాచి యుందురెపుడుఁ గానఁ జాతుర్మాస్య నన్న మొసఁగవలయు హరికి ద్విజుఁడు.

సీ॥ కమనీయతమములౌ తమలంపుటాకులం బోలుపారుచుండెడి పోకపండ్లు
స్వాదుఫలౌనట్టి జంబూఫలంబులం దద్దయు మధురమౌ దాక్షపండ్లు
తృప్తికరంబులౌ తియ్యమామిడిపండ్లఁ జాల స్థూలములైన జామపండ్లు
క్రొత్తదనములౌనట్టి దాడిమఫలములం దత్కాలసముదాహృత పగముతను
జక్రపాణిఁ గరము సంతుష్టునొనరింప నర్ఘ్యమీయవలయు నధికభక్తి.
అంత నాచమనము నార్తిక్యమును నిచ్చి యనుంబుతొల్లఁ బ్రికులుపొందె.

తే॥ శంఖతీర్థంబు గొంచుఁ దత్సలిలమందు ఫలములుంచి మధుద్వేషి ప్రీతికృతియగు
యతివరున కర్ఘ్యమిచ్చిన నబ్ధిసప్తకాంబుదానఫలావాప్తి యగును బ్రజకు. ౬౫౦

క॥ పదునాలవ బుధ్యాన యతిపదముల కొంగఁగవలయుఁ. బదపడి భక్తిన్
పదునైదవదగు బుధ్యానఁ బ్రదక్షిణము సేయనగును బాలుఁతోడన్ ౬౫౧

తే॥ నాలుగుప్రాయములు జగన్నాథరూపుఁడైన యతికిఁ బ్రదక్షిణమాచరింప
నర్ధి జగతీత్రయంబున కగుఁ బ్రదక్షిణం. బటుల సర్వతీర్థాటనంబు నగును. ౬౫౨

## — సాయుజ్యచింతనభక్తి. —

ఆ॥ యోగవేత్తయగుచు నొగిఁ బదునారవ బుధ్యచేత దేకబుపివరేణ్య!
స్వాంతమందు దేవసాయుజ్యచింతన సేయవలయు భక్తి క్షితిసురుండు. ౬౫౩

క॥ తనకును మధుసూదనునకు ననయము భావింపఁగూడ దాత్మను మూర్తిన్.
మను యోగవిదుఁడు దృశ్యంబన మూర్తామూర్తరూపుఁడగుటఁ దనూజా! ౬౫౪

ఆ॥ అతఁడు దృష్టుఁడైన యావల సదసత్స్వరూపమునను బ్రభవమై పాలివెడి
క్రియను నివృత్తమగుఁ దనయ! తేజములలోన నాత్మ రవిగ నెంచునది సతంబు.

ఆ॥ ఏని హరి యటంచు నెద నెప్పుడును విచారించునట్టి ద్విజవరేణ్యుఁడు సుత!
హరిశరీర మొంది యగును జీవన్ముక్తుఁ. డింతకన్న నెక్క నేమిగలదు ౬౫౬

క॥ చాతుర్మాస్యము యోగసమేతుఁడు కావలయు ద్విజుఁడు మిక్కిలి. శ్రీమా
దాతయగు విష్ణునం దిది యాతతమగు భక్తియోగ మాత్మజ! వినుమా. ౬౫౭

ఆ॥ అట్టి భక్తియోగ మాపాలులకె కాక క్షత్రియైశ్యులకును సముచితంబు.
స్త్రీలు శూద్రజాలును ద్విజగతిసంచార! దాని నాచరింపఁ దగరు తగరు " ౬౫౮
వ॥ అని చెప్పుటయును నారదుండిట్లనియె. ౬౫౯

క॥ "స్త్రీశూద్రుల కెదిధర్మము? శ్రీశుని సేవింపకుండ నెటు లవ్వారల్
పాత్రత్వము వహియింతురు? లోకసద్వ్రతి! ముక్తియెట్లు లాగఁ జెపుమయ్యా."

౯ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసర్కిలినస్పెక్టరు, నర్సారావుపేట.

౧౦ నారాయణరావుగారు, దాతారుపల్లి

౧౧ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు-పాపురం.

౧౨ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు

౧౩ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౪ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ

౧౫ బేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట

౧౬ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౭ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౮ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం

౧౯ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౨౦ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్‌స్పెక్టరు - కొమ్మాలపాడు.

౨౧ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట

౨౨ నండ చినవెంకయ్యగారు, దండమూడి.

౨౩ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.

౨౪ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - కాతాపురం.

౨౫ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౨౬ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం

౨౭ తాళవెలిమ లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం

౨౮ కిషన్ రావు దేశపాండ్యాగారు తాళ్లపల్లి

౨౯ వెంకటరాజయ్య, మక్తేదారుగారు - సీతారాంపురం

౩౦ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.

౩౧ కుంటుపల్లి రామారావుగారు, సంగెం.

౩౨ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౩౩ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.

౩౪ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము

౩౫ కాకిరాల రామచంద్రయ్యగారు, మముదాపురము

౩౬ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు

౩౭ కొండంభట్లగారి వెంకన్న గారు. గుమ్మడిదల

౩౮ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపుర●

౩౯ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-పెదవీడు.

౪౦ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.

౪౧ కుంటుపల్లి అమృతరావుగారు-సంగెం.

౪౨ మొసలి పాపిరెడ్డి మొకద్దంగారు-కొమ్మేపల్లె.

౪౩ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు-హైదరాబాద.

౪౪ ఓబులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

# అభినవ సరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కరిణీశోద్ధారిణి [పూర్వ వీరభద్రకవి] ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము ... | 0 | 3 | 0 |
| 11 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | 0 | 8 | 0 |
| 12 | వత్సలనీతిశతకము ... | 0 | 1 | 0 |
| 13 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | 0 | 3 | 0 |
| 14 | పశ్యశబ్దవిచారము ... | 0 | 2 | 0 |
| 15 | పురశ్చరణము ... | 0 | 2 | 0 |
| 16 | శంతనురాజచరిత్ర ... | 0 | 14 | 0 |
| 17 | వర్ణవ్యవస్థ ... | 0 | 4 | 0 |
| 18 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 19 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము ... | 0 | 10 | 0 |
| 20 | అభినవశాకుంతల నాటకము ... | 0 | 8 | 0 |
| 21 | నూతసంహిత-ఆంధ్రము ... | 2 | 0 | 0 |
| 22 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | 1 | 0 | 0 |
| 23 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 24 | డిటో నాగరఖండము (3 సంపుటము) | 1 | 8 | 0 |
| 25 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |
| 26 | ధర్మనిర్ణయము. | 0 | 4 | 0 |
| 27 | భారతకథాతత్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛయనులుగారు) | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరు జిల్లా.